# శ్రీ సంగమేశ శతకం




రచన : డా॥ కృష్ణకౌండిన్య

# శ్రీ సంగమేశ శతకం




రచన

శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి గారి ప్రియ శిష్యుడు

## డా॥ కృష్ణ కౌండిన్య

ప్రచురణ

**శ్రీ శివరామదీక్షితీయ అచల గురూపపీఠ రాజయోగాశ్రమము**

**బచ్చన్నపేట - 506 221, జిల్లా: వరంగల్**

# శ్రీ సంగమేశ శతకం

డా॥ కృష్ణ కౌండిన్య B.Com, B.Ed, M.A, T.P.T, M.Phil, Ph.D
(తెలుగు భాషా పండితులు, జి.ప. ఉ.పా, చింతపల్లి, జి॥నల్లగొండ)

ప్రథమ ప్రచురణ ... క్రీ.శ. ఫిబ్రవరి 21, 2001... ప్రతులు ... 1000

cover designed & laser type set
by: Dr R. Sreedhar

ప్రతులకు

1) శ్రీమతి పొన్నాల అనసూయాంబ గారు, ఇం.నెం. 4-1-96,
రాజయోగాశ్రమము, పాతబోయిగూడ, సికింద్రాబాదు-500 008

2) శ్రీ బోధానంద రాపెల్లి రామచంద్ర రాజయోగి,
ఉపకార్యదర్శి, రాజయోగాశ్రమము, బచ్చన్నపేట - 506 221,
జిల్లా: వరంగల్, ఫోన్: 08710-54262

వెల: రూ॥ 10/-



Printed by : SANDHYA PRINTING WORKS, Ramnagar, Hyd. ✆ : 7619862

శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠ
రాజయోగాశ్రమము,
పాతబోయిగూడ, సికింద్రాబాదు.

## ఆశీస్సులు

శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠ రాజయోగాశ్రమ సాంప్రదాయకులకు గురుపదములు సదా స్మరణచేయుటకు ఉపయుక్తములగునటుల ఆ॥ప॥ శ్రీ డా॥ కృష్ణకౌండిన్య 'శ్రీ సంగమేశ శతకం' ను రచించగా, అద్దానిని శ్రీ శివరామదీక్షిత అచల గురుపీఠ రాజయోగాశ్రమము(బచ్చన్నపేట) యొక్క ఉపకార్యదర్శి యగు శ్రీ బోధానంద రామచంద్ర రాజయోగిచే ప్రచురింబడిన ఈ గ్రంథము భక్త జనుల ఆదరణ పొంది, ఆదర్శనీయమౌగాక! శుభాశీస్సులు.

ఇట్లు
పీఠాధిపతి
డా॥ శ్రీ దయానంద పొన్నాల
సాందీపిని రాజయోగీశ్వరులు

## పీఠిక

ఈ గ్రంథరాజమును హృద్యంగా రచించిన డా॥ కృష్ణ కౌండిన్య ( తండు కృష్ణయ్య) నా ఆత్మీయ సోదరుడు. నేను కాకతీయ విశ్వ విద్యాలయంలో చదువుచున్న కాలంలో వీరితో పరిచయం ఏర్పడింది. వీరికి వేదాంత విషయాలయందు ఆసక్తి ఎక్కువ. నేను మాటల సందర్భంలో కొన్ని వేదాంత విషయాలను మాట్లాడుట జరిగెను. ఆ విషయములు వారి మనసును ఆకర్షించుటచేత, వారు నా గురుదేవులైన శ్రీ సంగమేశులవారిని చూడగోరిరి. ఒకానొక మధుర క్షణమున కృష్ణయ్యగారు శ్రీవారి దర్శన భాగ్యమునకు నోచుకొనిరి. ప్రథమ కలయికలోనే శ్రీవారిని అనేక ప్రశ్నలను అడిగి వాటికి సరియైన సమాధానములు తిరిగి పొంది, ఇతడే నిజగురువని గుర్తించి, వెంటనే శిష్యుడై అచల బోధను ఆలకించుచుండెను. తాను తెలుసుకున్న విషయాలను శ్రీవారి శత జయంతి ఉత్సవముల సందర్భముగా 'శరణు సంగమేశ శరణు శరణు' అను మకుటముతో నూటయెనిమిది ఆటవెలది పద్యములను అందముగ రచించి శ్రీవారికి అర్పించెను. దీనికి 'శ్రీ సంగమేశ శతకం' అని నామమిడిరి. దీనిని ఆమూలాగ్రముగ చదివితిని. ఇందలి పద్యములన్నియు మృదు మధురముగాను, సరళ సుందరముగాను వున్నాయి. తీయ తీయని తేట తెలుగు పదాలతో సద్గురు సంకీర్తనాన్ని మరియు అచల బోధామృతాన్ని ఆటవెలది పద్యాలలో నింపి మనందరకు అందించిన కృష్ణ కౌండిన్య ధన్యజీవి.

ఇక గ్రంథస్థ విషయానికి వస్తే, ఈ గ్రంథము సద్గురువగు శ్రీ సంగమేశుల వారి మహిమాన్వితముల గూర్చి వర్ణించుచు మరియు అచటచట వారి జీవిత విశేషాలను ఉగ్గడించుచు పద్యరత్నాలను అందించారు కవి. అంతియే గాక గురువుకు శిష్యుడు తన కష్ట నిష్ఠూరాలను చెప్పుచు, అన్యాపదేశంగా అనేక రకాల ప్రశ్నలు వేయుచు ఏ విధంగా సమాధానములు పొందుతాడో, స్వీయ అనుభవము ద్వారా గ్రహించి చెప్పిన పద్యములు అద్భుతంగా వున్నాయి. ముఖ్యంగా శిష్యుడు ప్రబోధ వినుటకు గురువును ఏ విధంగా ప్రసన్నం చేసుకోవలెనో అనేక పద్యాలలో వివరించారు. అంతియేగాక ప్రాథమిక దశలో నున్న



శిష్యుడు గురువును ఏ ఏ ప్రశ్నలను అడుగవలెనో కూడా తెలియజేసియున్నారు.

ఎవరైతే ఇందలి పద్యములలోనున్న సద్గురు సంకీర్తనములను గొంతు విప్పి ప్రతి రోజు పాడుకొందురో, వారికి హృదయ వికాసము కలిగి సద్గురుని శక్తియుక్తులు సిద్ధించగలవు. ఎన్ని సార్లు, ఎంత మంది, ఎన్ని రకాల కవనములు చేసిననూ, సద్గురుని చరితము వర్ణించుటకు ఎవ్వరికిని శక్యముగానిది. అయిననూ భక్తుడైనవాడు ఏమారక నిరతము సద్గురుని స్తోత్రము చేయుటచే మరియు సద్గురుని చరితమును నిత్యము చదువుటచే జన్మభ్రాంతిని సులభంగా వీడి, సర్వ సౌఖ్యములను పొందగలడు. ఇది సద్గురుని వాక్యము.

వేదాంతమును పద్యాలలో వివరించడం కష్టమే. కాని కృష్ణయ్య శ్రీగురుకృపా విశేషముతో అవలీలగా అచలవేదాంత తత్త్వమును సులభశైలిలో విప్పిచెప్పారు. గురు మహిమ వర్ణన, ఎరుక పరిప్రశ్నముల నిర్ణయములే గాక లోక నీతికి సంబంధించిన పద్యాలను కూడా అందించి యున్నారు. ఈ గ్రంథము ప్రతి ఒక్కరిని రంజింపజేయుననుటలో సందేహమేమీ లేదు. ముందు ముందు కూడా కవి కలము నుండి ఇలాంటి ఉత్తమ రచనలే వెలువడి జిజ్ఞాసులైన ముముక్షువులకు కరదీపికలై వెలుగొందుతాయని ఆశిస్తున్నాను.

ఇట్లు
సద్గురుని సేవకుడు
**శ్రీ డా॥ బ్రహ్మానంద శ్రీధరస్వామి**

## కవి మాట

శ్రీ మదచలర్షి రామడుగు శివరామ దీక్షితాచల గురూపీఠ కార్యదర్శి మరియు మద్గురువర్యులు శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి శత జయంతి ఉత్సవముల సందర్భంగా 'శ్రీ సంగమేశ శతకం' అను అష్టోత్తర శత పద్య సుమాల్ని సమర్పించుకునే అదృష్టం కలిగినందుకు ధన్యుడనని భావించుచున్నాను. భ్రాంతి రహితోపదేశికులు సాంప్రదాయక నిజగురుదేవులైన శ్రీవారు తన దివ్య బోధామృతముచే ఎందరెందరినో తరింపజేస్తున్నారు. సంశయములు ఆవరించగా తుఫానులో చిక్కిన నడిసంద్రపు నావ రీతిలా కొట్టుమిట్టాడుచున్న జనావళికి అండదండగా నిలచి ఆదరించి అక్కున చేర్చుకొని పరిపూర్ణ తత్త్వాన్ని తెలియజేస్తున్న పూర్ణ గురువులు శ్రీ సంగమేశులవారు.

జిజ్ఞాసియైన ముముక్షువు సద్గురువునాశ్రయించి ఆతనిని వేడుకునే విధము, సంశయ విచ్ఛేదనము గావించుకొనుటకు అడిగే ప్రశ్న పరంపర సమాహారం మున్నగు విషయాలనన్నింటిని తెలియ జేస్తూ 'శరణు సంగమేశ శరణు శరణు' అను మకుటంతో ఆటవెలది పద్యాలను రచించి శ్రీవారి ముందు వినిపించడం కూడా జరిగింది. శ్రీవారి కృపాకటాక్షములకు పాత్రుడనై రచించినదే తప్ప ఇందులో నా గొప్పతనమేమీ లేదు. కాకతీయ విశ్వ విద్యాలయంలో చదువుకుంటున్న రోజుల్లో అంధకారంలో కాంతి రేఖ వలె కనిపించి శ్రీవారి దర్శన భాగ్యమును కలిగించుటయేగాక, ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థికంగా హార్దికంగా పూర్తి సహకారమందించిన ఆత్మీయ సోదరులు శ్రీ డా॥ బ్రహ్మానంద శ్రీధర స్వామి గారికి మరియు ఆశీస్సులందించిన పీఠాధిపతులు శ్రీ డా॥ దయానంద పాన్నాల సాందీపిని రాజయోగీశ్వరులవారికి ధన్యవాదములు తెలుపుచున్నాను. భక్తాదులీ చిన్న పొత్తమును గానమొనరించి భావార్థమును గ్రహించగలరని మనవి.

ఇట్లు
సద్గురు పాద ధూళి రేణువు
డా॥ కృష్ణ కౌండిన్య



**శ్రీ వివేకానంద ఆగోలు సంగయాఖ్య రాజయోగి గారి ప్రియ శిష్యుడు**



**గ్రంథకర్త : డా॥ కృష్ణ కౌండిన్య**

## మిత్ర స్తుతి

ఆ.వె.	అంధకారమంత అలము కొనగ నాలో
కాంతి రేఖ వోలె కానుపించి
స్నేహితుండుయైన శ్రీధరు కృపచేత
గురుని పదము గంటి గురుతు గంటి.

కం.	రాపెల్లి శ్రీధరుండును
ఈ పొత్తముకయ్యె ఖర్చు నెలమితొ యిచ్చెన్
నా పాలి భాగ్యరేఖకు
ఏ పొద్దున శుభము జరుగనెంతును మదిలోన్.

# శ్రీ సంగమేశ శతకం

ఆ.వె.	తల్లి దండ్రి తొల్లి దైవమ్ము నీవని
తలచి వుంటి మదిని తథ్యమయ్య
ఎల్ల కాలమందు ఏలికలిక మీరు
శరణు సంగమేశ శరణు శరణు.	1

ఆ.వె.	ఈషణత్రయముల నెందుకో వీడక
కుందుచుంటి నేను కువలయమున
బాధలన్ని దీర్చు పరమాత్ముడవు నీవు
శరణు సంగమేశ శరణు శరణు.	2

ఆ.వె.	కామ క్రోధములను కడతేర్చలేకను
విషయ వాంఛలందు విసిగి వుంటి
మనసులోన నున్న మాలిన్యమును బాపు
శరణు సంగమేశ శరణు శరణు.	3

ఆ.వె.	వాసనత్రయముల వదలలేక మిగుల
భయదమైన తిమిరమందు వుంటి
జ్ఞాన జ్యోతి జూపు జ్ఞాన బ్రహ్మలు మీరు
శరణు సంగమేశ శరణు శరణు.	4

ఆ.వె	నీటి బుడగ వంటి నీటైన దేహంబు
నిక్కమనుచు జగతి నీల్గుచుంటి
నిక్కమైన దారి నెరుగ జేయుము తండ్రి
శరణు సంగమేశ శరణు శరణు.	5

ఆ.వె. ఘోర మైన యట్టి కృత్యమ్ములను జేసి
పాప పంకిలమున నే పడుంటి
జన్మరహితమయ్యె మర్మాన్ని యెరిగించు
శరణు సంగమేశ శరణు శరణు. 6

ఆ.వె. సార హీనమైన సంసార సంద్రాన
దిక్కులేక బిక్కు బిక్కు మనుచు
వున్న నన్ను వేగ వుద్ధరించుము స్వామి
శరణు సంగమేశ శరణు శరణు. 7

ఆ.వె. గడచి పోయి నట్టి కాలంబునెంతయో
వ్యర్థ పరచి వుంటి వాస్తవముగ
సార్థకంబగు పరమార్థంబు బోధించు
శరణు సంగమేశ శరణు శరణు. 8

ఆ.వె. మాతృ గర్భ మందు మల మూత్ర కొంపలో
మెసల లేక చాల విసిగి వుంటి
మళ్ళి జన్మ లేని మార్గంబు నెరిగించు
శరణు సంగమేశ శరణు శరణు. 9

ఆ.వె. బాల్య మందు వెర్రి భ్రాంతిలో బడిపోయి
ఆటలన్ని యాడి అలసి వుంటి
కాల చక్రమెంతో కడు విచిత్రంబుగా
శరణు సంగమేశ శరణు శరణు. 10

ఆ.వె. యవ్వనమున మదము క్రొవ్వి మోహము చేత
కండ్లు గాన కుండి కరుణ లేక
సాటి వారి తోటి జగడ మాడితి నయ్య
శరణు సంగమేశ శరణు శరణు. 11



ఆ.వె. నాది నీది యన్న భేద భావము గల్గి
వాదు లాడు చుంటి పరము గనక
నేను నేను యనుచు నేనేమి గనలేదు
శరణు సంగమేశ శరణు శరణు. 12

ఆ.వె. తీర్థ యాత్రలెన్నొ తిరిగి సేవించితి
అర్థమంత ఎంతొ వ్యర్థమయ్యె
కాలమంత గడిచె కన్నీళ్ళె మిగిలెను
శరణు సంగమేశ శరణు శరణు. 13

ఆ.వె. కనుల యెదుట మనకు కనిపించనట్టియా
దైవమెచట? జూడ తరము గాదె?
అట్టి దైవమనిన గట్టిగా నీవెలె
శరణు సంగమేశ శరణు శరణు. 14

ఆ.వె. సార హీనమైన చదువులెన్నొ చదివి
కూటి కొరకు నేను కుందు చుంటి
నిక్కమైన చదువు నీవె నేర్పుము తండ్రి
శరణు సంగమేశ శరణు శరణు. 15

ఆ.వె. దార సుతులు నన్న దమ్ములున్నారనుచు
ఆశ పడుచు నుంటి నవని లోన
వెళ్ళి పోవు నాడు వెంటరారెవరయ్య
శరణు సంగమేశ శరణు శరణు. 16

ఆ.వె. పరుల సొమ్ము జూచి పాప కార్యమనక
దొంగిలించు నరుడు ధూర్తుడంట
పాపములను బాపి వరగ రక్షణ జేయు
శరణు సంగమేశ శరణు శరణు. 17

ఆ.వె. ఎండ మావి గాంచి యింపుగా జలమని
నమ్మి వుంటి సంశయమ్ము లేక
నిజము కల్ల యేదొ? నీవె చెప్పుము స్వామి
శరణు సంగమేశ శరణు శరణు. 18

ఆ.వె. చెడ్డవారి తోడ స్నేహంబు నే జేసి
తిరిగి చెడితి మంచి తెలియలేక
మంచి తనము పెంచు మహనీయుడవు నీవు
శరణు సంగమేశ శరణు శరణు. 19

ఆ.వె. దేవుడంటె యెచటొ దేవులాడిన లేదు
చెట్టు పుట్ట నందు గట్టు మీద
గుట్టు తెలిసె నేడు గురువె దైవంబని
శరణు సంగమేశ శరణు శరణు. 20

ఆ.వె. సకల శాస్త్రములను చదివితే ఫలమేమి?
అర్థమెరుగ లేక వ్యర్థమైతి
అనుభవంబు తోడ అచలంబు నెరిగించు
శరణు సంగమేశ శరణు శరణు. 21

ఆ.వె. ధర్మమనగ నేమి? కర్మయనగ నేమి?
సత్తు యనగ నేమి? చిత్తు యేమి?
ఏమి తెలియలేను యెరుగ జేయుము తండ్రి
శరణు సంగమేశ శరణు శరణు. 22

ఆ.వె. ఎరుక యనగ నేమి? మరుపు యనగ నేమి?
అచలమనగ దాని యర్థ మేమి?
ఎరుక మరుపులెల్ల నెరుగ జేయుము స్వామి
శరణు సంగమేశ శరణు శరణు. 23



ఆ.వె. విదితమైన శ్రీ వివేక మునీశ్వర
రాజయోగివయ్యి రమ్యముగను
దీన జనుల కెల్ల దిక్కు నీవైతివి
శరణు సంగమేశ శరణు శరణు. 24

ఆ.వె. అవతరించినావు ఆగోలు వంశాన
అచల గురుడ వైతి వవని లోన
కోటి వందనములు కోరి చేయుదునయ్య
శరణు సంగమేశ శరణు శరణు. 25

ఆ.వె. కంటికెల్ల వేళ కనురెప్ప రక్షణ
వలువ రక్ష తనువుకిలను జూడ
మనసుకేమొ రక్ష మహనీయులిక మీరు
శరణు సంగమేశ శరణు శరణు. 26

ఆ.వె. డాంబికములు మరియు డాబు దర్పములేని
పరుషమింత లేని పరమ పురుష
నిన్ను గాంచి నట్టి కన్నులె ధన్యంబు
శరణు సంగమేశ శరణు శరణు. 27

ఆ.వె. దేశికేంద్ర నీదు దిక్కు నాకుండంగ
ఇంత కన్న వేరె యేమి వలదు
సకల సంపదలును సమమౌనె మీతోటి?
శరణు సంగమేశ శరణు శరణు. 28

ఆ.వె. తీర్థయాత్రలన్ని తిరిగిన ఫలమంత
వేయి వంతు గాదు బిందువందు
నీదు పాద తీర్థమే దురిత హరణం
శరణు సంగమేశ శరణు శరణు. 29

ఆ.వె. నీదు వాక్కు మహిమనెంతని వర్ణింప
తరము గాదు నాకు స్థిర మనస్వి!
పంచదార కన్న మించును మధురము
శరణు సంగమేశ శరణు శరణు. 30

ఆ.వె. ఎచట పుట్టినావో? ఎచట పెరిగినావో?
ఎచటికెచటికీవు యేగినావో?
ఇటకు వచ్చి మాకు యిల వేల్పువయినావు
శరణు సంగమేశ శరణు శరణు. 31

ఆ.వె. గురువర నిను మదిని స్మరణ జేసితె చాలు
కలుష హరణ మగును కాంక్షలుడుగు
మదియు స్థిరముగుండు మహనీయ సతతము
శరణు సంగమేశ శరణు శరణు. 32

ఆ.వె. దీక్ష విడువ లేని దేశికేంద్రులు మీరు
పట్టు వదల బోరు గుట్టునెంచి
నిన్ను నమ్ము వారి నిరతంబు బ్రోచేరు
శరణు సంగమేశ శరణు శరణు. 33

ఆ.వె. కంటి వైద్యుడేమొ కంటినేకాపాడు
పంటి వైద్యుడేమొ పన్ను జూచు
మంటి మనసు దిద్దు మంచి వైద్యులు మీరు
శరణు సంగమేశ శరణు శరణు. 34

ఆ.వె. నిన్ను గన్న తల్లి యెన్ని నోములు నోచె?
కడుపు పంట పండి ఘనత కెక్కె
అట్టి కన్న తల్లి పుట్టుకే ధన్యంబు
శరణు సంగమేశ శరణు శరణు. 35



ఆ.వె. ఏమి పూజజేసె? ఎలమితో మాయమ్మ
నయ వినయము వున్న నర్సమాంబ
సప్త పదిని నడువ సార్థకతను బొందె
శరణు సంగమేశ శరణు శరణు. 36

ఆ.వె. లచ్చమాంబ మరియు లక్ష్మినర్సయ్యల
పుణ్య ఫలము తోడ పొందుగాను
అవతరించినావు ఆనందముప్పొంగ
శరణు సంగమేశ శరణు శరణు. 37

ఆ.వె. పాండు రంగరావు భ్రాత కావలె నాకు
భక్త కోటియంత బంధు జనము
వారి నాదరించ వలెనంచు బూనితి
శరణు సంగమేశ శరణు శరణు. 38

ఆ.వె. సిరులు గల్ల కొండ శిరికొండ గ్రామంబు
వెండి కొండ వోలె వెలుగు వెలిగి
జన్మనిచ్చి మీకు చరితార్థమాయెను
శరణు సంగమేశ శరణు శరణు. 39

ఆ.వె. రాజయోగి జేరి రాజయోగము బూని
రాజయోగివయ్యి రయముగాను
వేద వేద్యులకును వేత్తవైతివి స్వామి
శరణు సంగమేశ శరణు శరణు. 40

ఆ.వె. వసుధ ఖ్యాతి గన్న బచ్చన్నపేటలో
కొలువు తీరి వుండి కోర్కె దీర్చు
భక్తజనులకెల్ల భగవంతుడవు నీవు
శరణు సంగమేశ శరణు శరణు. 41

ఆ.వె. జవము రోగమున్న నవరంధ్రముల కొంప
నీటి బుడగ యనుచు నెరుగనైతి
ఉన్న అచలమందు సున్న యిదే కదా?
శరణు సంగమేశ శరణు శరణు. 42

ఆ.వె. నీదు మహిమనింత నెన్న తరముగాదు
కవులకైన మేటి ఘనులకైన
నాదు శక్తియెంత? నయముగా కరుణించు
శరణు సంగమేశ శరణు శరణు. 43

ఆ.వె. వేట మృగమునంటి వేటాడు మృగయుని
ఛందమోలె మృత్యు సరళి వుండె
మృత్యు భయము బాపి ముక్తి ప్రదాతవు
శరణు సంగమేశ శరణు శరణు. 44

ఆ.వె. ప్రాణి యెచట పుట్టె? ప్రాణి యెచటికేగె?
ప్రాణమున్న తనువు ప్రాకులాడు
ప్రాణగతిని తెలిపి పరతత్త్వమెరిగించు
శరణు సంగమేశ శరణు శరణు. 45

ఆ.వె. మనిషియంటె నేమి? మనసుయంటెను యేమి?
మనసులోన వున్న మర్మమేమి?
మనిషి మనసు విప్పి మరుజన్మమాన్పించు
శరణు సంగమేశ శరణు శరణు. 46

ఆ.వె. ఆత్మయందు నెట్లు ఆకాశముదయించె?
ఆకసమున యెట్లు అనిలమొచ్చె?
సృష్టి వివరమంత స్పష్టము జేయుమా?
శరణు సంగమేశ శరణు శరణు. 47



ఆ.వె. పాము కుబుసమీడి పారిపోవు విధము
ప్రాణి కోటియంత పరుగు బెట్టె
పరుగులెత్తి యెత్తి పతనమైపోయెను
శరణు సంగమేశ శరణు శరణు. 48

ఆ.వె. గురుని పదముబట్టి గుహ్యమెరింగియు
గురుని స్మరణ జేసి గొప్ప వాడు
అంటియంటకుండ నవనిలో నడచును
శరణు సంగమేశ శరణు శరణు. 49

ఆ.వె. కపట బుద్ధి కలిగి కాషాయ వస్త్రాల
ముసుగులోన వుండి మోసపుచ్చి
అచలమెరుగలేక అధములైపోదురు
శరణు సంగమేశ శరణు శరణు. 50

ఆ.వె. పూర్ణ బోధ నీది పూర్ణంబు నెరిగించు
కల్ల గురుల బోధ కలత పెట్టు
మధ్య గురుల బోధ మహిమలు జూపించు
శరణు సంగమేశ శరణు శరణు. 51

ఆ.వె. పావనంబుజెంది పద్దూరు దొరవారు
నీదు తీర్థముగొని నిక్కముగను
జటిల రోగ బాధ తృటిలోన విడిపోయె
శరణు సంగమేశ శరణు శరణు. 52

ఆ.వె. తపము జేసి చేసి ఉపమేదో గానక
జపము జేసి చేసి జడుడనైతి
జపము తపము యేల స్వామి మీ సన్నిధి
శరణు సంగమేశ శరణు శరణు. 53

ఆ.వె. గురుని తత్త్వమేదో గురుతుగా గాంచక
యాగమేల? రాజ భోగమేల?
అన్ని వ్రతములిలను సున్నయై పోవును
శరణు సంగమేశ శరణు శరణు. 54

ఆ.వె. మరణమొంది నంత తిరిగి జన్మము వచ్చు
జన్మయెత్తినంత కర్మవుండు
జన్మ కర్మలేని మర్మాన్ని యెరిగించు
శరణు సంగమేశ శరణు శరణు. 55

ఆ.వె. మనిషి జన్మ యెంతో మహిమాన్వితంబౌను
గురుని జేరి వేగ గుట్టు దెలియ
అట్టి అచల గురుని గట్టిగా పొడగంటి
శరణు సంగమేశ శరణు శరణు. 56

ఆ.వె. దేవ! నీవె దిక్కు దైవంబు నీవని
చరణములిక వీడ సన్నుతాంగ!
సకల ధర్మములను సరగున యెరిగించు
శరణు సంగమేశ శరణు శరణు. 57

ఆ.వె. ఎన్నొ జన్మములను యెత్తియు యిలపైన
బాధలెన్నొ పొంది భంగ పడితి
తుట్ట తుదను గంటి ఇట్టి గురువరుని
శరణు సంగమేశ శరణు శరణు. 58

ఆ.వె ఇహము పరము యేదో యెరిగించి పిదపను
స్వర్గ నరకములను స్వానుభవము
తెలియ జేసి బోధ తెరవు జూపిన దేవ
శరణు సంగమేశ శరణు శరణు. 59



ఆ.వె. తాను తనదులోని తత్త్వంబు తెలియక
దేవులాడుటేల? దేవుడనుచు
గురువె దైవమనుచు గురుతుతో మిముగంటి
శరణు సంగమేశ శరణు శరణు. 60

ఆ.వె. సకల శాస్త్రములను సాధించి శోధించి
అచల పూర్ణ యోగమంత పొంది
సంశయముల దీర్చు స్వామి వీవేనయ్య
శరణు సంగమేశ శరణు శరణు. 61

ఆ.వె. అన్య సాధనముల నంటక నేనుందు
ననుచు బాస జేసి నంటి పదము
శిరమున ధరియిస్తి చరణ ధూళిని నేను
శరణు సంగమేశ శరణు శరణు. 62

ఆ.వె. ఎరుక మరుపు జేసి యీ వింత యాటను
ఆడుచున్నవయ్యు వేడుకలర
సకల లోకములకు స్రష్టవు నీవెగా?
శరణు సంగమేశ శరణు శరణు. 63

ఆ.వె. అష్టయోగములను నిష్ఠతో జేసితి
మఠమునందు జేరి హఠము జేస్తి
హితము గాంచలేక మతి చెడి తిరిగితి
శరణు సంగమేశ శరణు శరణు. 64

ఆ.వె. మంత్రములను నేర్చి తంత్రములను జేసి
భక్తి నెరుగ లేక భంగ పడితి
మతములందు జిక్కి వెతలను బొందితి
శరణు సంగమేశ శరణు శరణు. 65

ఆ.వె. ఆత్మమూలమేమి? ఆనతిమ్మని యంటె
తనకు తానె పుట్టు తానె లేక
పుట్టి పెరిగి గిట్టు నట్టిది మాయంత్రి
శరణు సంగమేశ శరణు శరణు. 66

ఆ.వె. పరమ పురుష నీదు పాదంబులను బట్టి
విడువబోను సర్వ వేళలందు
సంశయముల బాపి సంద్రాన్ని దాటించు
శరణు సంగమేశ శరణు శరణు. 67

ఆ.వె. పిన్న పెద్ద యన్న భేద భావము లేదు
పాపి దోషి యన్న పదము లేదు
భేదములను యణచి మోదంబు గూర్చుము
శరణు సంగమేశ శరణు శరణు. 68

ఆ.వె. దొంగయైనగాని దొరయయ్యెననుగాని
భోగి యోగి గాని రోగి గాని
హెచ్చు తగ్గు యన్న యేహ్య భావము లేదు
శరణు సంగమేశ శరణు శరణు. 69

ఆ.వె. గాలి వానయెంత ఘనముగా వచ్చిన
పిడుగు లెన్ని యైన పడినగాని
కాలత్రయమునందు క్రమము తప్పరు మీరు
శరణు సంగమేశ శరణు శరణు. 70

ఆ.వె. దివ్య గుణములున్న దేశికేంద్రులు మీరు
సకల భూతములకు సాక్షి మీరు
అండ పిండమందు అంతటనున్నారు
శరణు సంగమేశ శరణు శరణు. 71



ఆ.వె. అంతటున్న అచలమంతయు జూపించి
చింత లెరుగ నట్టి చేష్ట దెలిపి
స్వస్వరూపమంత సమసినటుల జేయు
శరణు సంగమేశ శరణు శరణు. 72

ఆ.వె. ఎల్ల కాలమందు ఎల్ల వేళలయందు
నీదు పూజజేతు నిక్కమయ్య
అయ్య మిమ్ము దప్ప అన్య స్మరణ లేదు
శరణు సంగమేశ శరణు శరణు. 73

ఆ.వె. అల్ప బుద్ధి కలిగి అధమత్వమున నేను
నిన్ను యెంచ లేను సన్నుతముగ
చూపుమయ్య నీదు రూపులెల్లను నాకు
శరణు సంగమేశ శరణు శరణు. 74

ఆ.వె. కర్మ వలన యింత కష్టమెందుకు వచ్చె?
జన్మ కర్మలనెడి జాల మేల?
జన్మ కర్మలన్ని జాగు సేయక బాపు
శరణు సంగమేశ శరణు శరణు. 75

ఆ.వె. మౌనమేలనయ్య మాట్లాడు నా తోటి
కోప మేల వచ్చె పాప హరణ
నీదు పలుకు విందు నిరతంబు నేనింక
శరణు సంగమేశ శరణు శరణు. 76

ఆ.వె. బ్రహ్మమనగ నేమి? భ్రాంతి యనగ నేమి?
విశ్వమనగనేమి ? విశద పరచి
స్వామి నన్ను నీవు చల్లంగ యేలుకో!
శరణు సంగమేశ శరణు శరణు. 77

ఆ.వె. జ్ఞాన యోగి వీవె ధ్యాన యోగివి నీవె
భక్తి యోగి వీవె భావ మరయ
కర్మ మర్మ మెరుగు కర్మయోగివి నీవె
శరణు సంగమేశ శరణు శరణు. 78

ఆ.వె. విమల యోగి వీవె అమల యోగివి నీవె
పూర్ణ యోగి వీవె పూర్ణ పురుష
ఆత్మ నరసి నట్టి ఆత్మయోగివి నీవె
శరణు సంగమేశ శరణు శరణు. 79

ఆ.వె. సాంఖ్య యోగి వీవె సాక్షిరూపుడ వీవె
తత్త్వయోగి వీవె తథ్యముగను
రాకపోక లేని రాజయోగివి నీవె
శరణు సంగమేశ శరణు శరణు. 80

ఆ.వె. శుభములకును నెలవు చూడ నీ సన్నిధి
అభయమిచ్చి బ్రోచి అండనిలిచి
వెతలనన్ని దీర్చు వేల్పువీవేనయ్య
శరణు సంగమేశ శరణు శరణు. 81

ఆ.వె. పసిడి పలుకు మీది పరమ పథము జూపు
వేచి వుండె చెవులు విదితముగను
అట్టి పలుకులన్ని ఆత్మలో దలతును
శరణు సంగమేశ శరణు శరణు. 82

ఆ.వె. వసుధ జలము అగ్ని వాయువాకాశాల
లక్షణము తెలిపి విలక్షణముగ
ధర్మ కర్మములను దయతోడ దాటించు
శరణు సంగమేశ శరణు శరణు. 83



ఆ.వె. కామమనగనేమి? కర్మేంద్రియములేమి?
రాగద్వేష క్రోధ రహిత మెటుల?
మురికి తనువునకును మూలమేమిటి తండ్రి?
శరణు సంగమేశ శరణు శరణు. 84

ఆ.వె. స్థూల దేహమేది? సూక్ష్మదేహము యేది?
కారణమునకేమి కారణంబు
దేహ నిర్ణయముల తేట పర్చుము స్వామి
శరణు సంగమేశ శరణు శరణు. 85

ఆ.వె. లోభమెంత కలిగె లోకంబు లోపల
అందులోనె లోకమంత మునిగె
లోభమెగురగొట్టి లాభాన్ని కలిగించు
శరణు సంగమేశ శరణు శరణు. 86

ఆ.వె. సప్త ధాతువులను సత్వరంబుగ జెప్ప
దేహి కెట్లు కలిగె? దేహములను
దేహ భ్రాంతి దీర్చు దేశికేంద్రులు మీరు
శరణు సంగమేశ శరణు శరణు. 87

ఆ.వె. పదిలముగను దెలుపు పంచవింశతి తత్త్వ
ములను, వాటి యొక్క మూలమేమి?
గుట్టు రట్టు జేయు గురువులు మీరయ్య
శరణు సంగమేశ శరణు శరణు. 88

ఆ.వె. పంచ ప్రాణములను పంచ కోశములను
ఎంచ తరము గాదు యెరుక పరచి
పంచ కోశములకు పరగ సాక్షిని జూపు
శరణు సంగమేశ శరణు శరణు. 89

ఆ.వె. ఇంద్రుడనగనెవరు? ఈశ్వరుండెవ్వరు?
వాయువెవరు? మరియు వరుణుడెవరు?
జీవుడనగ నెవరు? శివుడన నెవ్వరు?
శరణు సంగమేశ శరణు శరణు. ౹౦

ఆ.వె. అష్ట మదములేమి? అష్ట పాశము లేమి?
తాపత్రయములేమి? తాప హరణ
వ్యాధి త్రయములేమి? బోధజేయుము స్వామి
శరణు సంగమేశ శరణు శరణు. ౹౧

ఆ.వె. తల్లి దండ్రి భార్య తనయులు మిత్రులు
అత్త మామ బావలల్లుడనుచు
మోహమందుచుంటి మోక్షమార్గము వీడి
శరణు సంగమేశ శరణు శరణు. ౹౨

ఆ.వె. చదువు గలిగి గొప్ప సంసారమును గల్గి
ఎన్ని వున్న గాని సున్న యిలను
గురుని పదము హృదయ గుహాయందు లేకున్న
శరణు సంగమేశ శరణు శరణు. ౹౩

ఆ.వె. సకల సంపదంత సమకూడు కలలోన
వాస్తవమ్మొ? అది యవాస్తవమ్ము
అటుల లేని యెరుక అర్థమ్ము వివరించు
శరణు సంగమేశ శరణు శరణు. ౹౪

ఆ.వె. ధ్యాన ముద్రలేమి? ధ్యానము తెరగేది?
చక్రములను జూపి చక్కగాను
తారకంబు జెప్పి తనరకమును జూపు
శరణు సంగమేశ శరణు శరణు. ౹౫



ఆ.వె. క్షరమంటె నేమి? క్షరము కానిది యేమి?
ఆత్మ యేది? దాని యవధి యేమి?
ఎరుగజేయుమయ్య పరమాత్మ స్థానమ్ము
శరణు సంగమేశ శరణు శరణు. ౹౬

ఆ.వె. మఠము ఘటము పటము హఠమును శఠమును
మనము జనము ధనము దినము వనము
ఇదియు అదియు నెరుగు యెరుకయే నంటిరి
శరణు సంగమేశ శరణు శరణు. ౹౭

ఆ.వె. ఎరుక బ్రహ్మమనియు యెరుక కర్మమనియు
ఎరుక జ్ఞానమనియు యెరుక జేసి
లేని యెరుక గోల లెరిగించినారయ్య
శరణు సంగమేశ శరణు శరణు. ౹౮

ఆ.వె. తానె అన్నియయ్యి తన కవి వేరని
భ్రాంతి పొందుచుండు బహు విధముల
అట్టి యెరుక గుట్టు రట్టు జేసిన స్వామి
శరణు సంగమేశ శరణు శరణు. ౹౯

ఆ.వె. ఆత్మయే జగతికి ఆధారమైవుండె
ఆత్మ బీజమనుచు అదియు తెలిసె
వృక్షమనుచు జగము రూఢియై పోయెను
శరణు సంగమేశ శరణు శరణు. ౧౦౦

ఆ.వె. యజ్ఞ కర్త నీవె యజ్ఞభోక్తవు నీవె
యజ్ఞ రూప మీవె యజ్ఞ మీవె
దైవమీవె పరమ దేశికుడవు నీవె
శరణు సంగమేశ శరణు శరణు. ౧౦౧

ఆ.వె తరులు గిరులు సిరులు తలచిన కల యెల్ల
కలను వచ్చు హాయము కరమువోలె
అచల మొకటి సత్య మంటిరి నా స్వామి!
శరణు సంగమేశ శరణు శరణు. 102

ఆ.వె బట్ట బయలు తానె పరిపూర్ణముగ నుండె
ఏమిలేక యింక యెరుక లేక
నిర్ణయమికలేక నిఖిలంబు నందుండు
శరణు సంగమేశ శరణు శరణు. 103

ఆ.వె ఎరుక బయలు రెంటి నెరుక జేసియు మాకు
బయలు నిజము యెరుక భ్రాంతి యనుచు
బోధ నెరుగ జేసి బాధ దీర్చిన స్వామి
శరణు సంగమేశ శరణు శరణు. 104

ఆ.వె స్నేహితుండుయైన శ్రీధరుచే మీదు
దర్శనంబు కలిగె దార్శనికుడ!
ఇంత కన్న భాగ్యమేమి కావలె నాకు
శరణు సంగమేశ శరణు శరణు. 105

ఆ.వె కన్న తండ్రి వల్ల గలిగె యీ చింతన
విబుధ వరుల వల్ల వింటి కొంత
సారమెల్ల గంటి సద్గురు కృప వల్ల
శరణు సంగమేశ శరణు శరణు. 106

ఆ.వె జనని వెంకమాంబ జనకుండు సాయన్న
కృష్ణయాఖ్యుడనిక కోరి వినుడి
కొండ వరము వూరు తండు వంశము నాది
శరణు సంగమేశ శరణు శరణు. 107

ఆ.వె ఇట్టి పద్యములను యింపుగా జదివిన
సర్వ సౌఖ్యములును సర్వ మబ్బి
ఇట్టి దట్టి దనెడి వట్టి యెరుక మ్రగ్గ
శరణు సంగమేశ శరణు శరణు. 108

సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు

# Shri Sangamesha Shathakam
## - Dr Krishna Koundinya

---

వాసనత్రయముల వదలలేక మిగుల
భయదమైన తిమిరమందు వుంటి
జ్ఞాన జ్యోతి జూపు జ్ఞాన బ్రహ్మలు మీరు
శరణు సంగమేశ శరణు శరణు.

కంటి వైద్యుడేమొ కంటినే కాపాడు
పంటి వైద్యుడేమొ పన్ను జూచు
మంటి మనసు దిద్దు మంచి వైద్యులు మీరు
శరణు సంగమేశ శరణు శరణు.

తాను తనదులోని తత్త్వంబు తెలియక
దేవులాడుటేల? దేవుడనుచు
గురువె దైవమనుచు గురుతుతో మిముగంటి
శరణు సంగమేశ శరణు శరణు.

జవము రోగమున్న నవరంధ్రముల కొంప
నీటి బుడగ యనుచు నెరుగనైతి
ఉన్న అచలమందు సున్న యిదే కదా?
శరణు సంగమేశ శరణు శరణు.

బట్ట బయలు తానె పరిపూర్ణముగ నుండె
ఏమిలేక యింక యెరుక లేక
నిర్ణయమికలేక నిఖిలంబు నందుండు
శరణు సంగమేశ శరణు శరణు.